అర్జున ఉవాచ.

యోఽయంయోగ స్త్వయాప్రోక్త స్సామ్యేనమధుసూదన।
ఏతస్యాహంనపశ్యామి చంచలత్వాత్స్థితింస్థిరామ్. 33

హే మధుసూదన- ఓ శ్రీకృష్ణస్వామీ; త్వయా- నీచేత; సామ్యేన- మనస్సమాధానముచేత; యోయం యోగః- ఏ యోగము; ప్రోక్తః- చెప్పబడెనో; అహం- నేను; చంచలత్వాత్- చంచలమగుటవలన; ఏతస్య- ఈయోగమునకు; స్థిరాం- చలించని; స్థితిం- నిలుకడను; నపశ్యామి- కానను.

ఓ మధుసూదనా నీవు జెప్పిన సమత్వమనెడి యోగము అసాధ్యముగానున్నది మనస్సు నిలుకడలేనిది గావున ఈ యోగము యొక్క స్థిరమైనస్థితి నాకు దెలియలేదు.

చంచలంహిమనఃకృష్ణ ప్రమాథిబలవద్దృఢమ్।
తస్యాహంనిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరమ్. 34

హేకృష్ణ-ఓకృష్ణస్వామి; మనః-మనస్సు; చంచలం-చంచలమైనదియును ప్రమాథి-క్షోభపెట్టునదియును; బలవత్-నిగ్రహింప శక్యముగానిదియును; దృఢం- దృఢమైనదియును; అహం-నేను; తస్య-ఆమనస్సుయొక్క; నిగ్రహం-నిరోధమును; వాయోః-వాయువుయొక్క; నిగ్రహమివ-నిగ్రహమువలెనే; సుదుష్కరం-మిక్కిలిచేయనశక్యమైనదానినిగా; మన్యే-తలంచుచున్నాను.

కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివనశ్యతి।
అప్రతిష్ఠోమహాబాహో విమూఢో బ్రహ్మణఃపథి. 38

హే మహాబాహో - ఓ శ్రీకృష్ణస్వామీ; బ్రహ్మణః- పరమాత్మయొక్క; పథి-మార్గమందు; విమూఢః-మూఢుడైనపురుషుడు; అప్రతిష్ఠస్సన్-నిరాశ్రయుడయినవాడగుచు; ఉభయవిభ్రష్టః-కర్మజ్ఞానమార్గములనుండి జారినవాడై; ఛిన్నాభ్రమివ-చెదరిన మేఘమునలె; ననశ్యతికచ్చిత్ - చెడిపోడేమి?

ఓయి కృష్ణ! పరమాత్మానుసంధానము జేయలేని మూఢుడు నిరాశ్రయుడయి కర్మజ్ఞాన మార్గముల రెండింటియందు భ్రష్టుడై చెదరిపోయిన మేఘమునలె చెడిపోక యుండునా యేమి?

ఏతంమేసంశయంకృష్ణ చ్ఛేత్తుమర్హస్యశేషతః।
త్వదన్యస్సంశయస్యాస్య చ్ఛేత్తానహ్యుపపద్యతే. 39

హే కృష్ణ-ఓకృష్ణస్వామీ: త్వం-నీవు; మే-నాయొక్క; ఏతంసంశయం - ఈసందేహమును; అశేషతః- మిగతలేనట్లు; చేత్తుం-పోగొట్టుటకొఱకు; అర్హసి- తగుదువు; అస్యసంశయస్య - యీసంశయముయొక్క; ఛేత్తా-పోగొట్టెడివాడు; త్వదన్యః-నీకంటెనితరుడు; నోపపద్యతేహి - దొరకడుగదా.

ఓయి కృష్ణ! నాకుగలిగిన యీ సంశయమును నిశ్శేషముగా నివర్తింపజేయుటకు నీవే తగుదువు. ఈ సంశయమును పోగొట్టుటకు నీవు దక్క మఱియొకడు దొరకడు.

శ్రీ భగవానువాచ.

పార్థనైవేహనాముత్ర వినాశ స్తస్యవిద్యతే।
నహికల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాతగచ్ఛతి. 40

హే పార్థ - ఓఅర్జునుడా; తస్య - ఆయోగభ్రష్టునకు; వినాశః - నాశము; ఇహచ - ఈలోకమందును; నైవవిద్యతే - లేదు; అముత్రచ - పరలోకమందును; న - లేదు; హేతాత - ఓ తండ్రీ; కల్యాణకృత్ - శుభము చేసినవాడు; కశ్చిదపి - ఒకడును; దుర్గతిం - కుత్సితస్థానమును, నగచ్ఛతిహి - పొందడుగదా?

ఓయి పార్థ! అట్టి యోగభ్రష్టునకు ఇహపరలోకములయందు నాశము లేదు. నాయనా మంచిచేసినవాడు ఒకప్పుడున్ను చెరుపు నొందడు.

ప్రాప్యపుణ్యకృతాంలోకా నుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాంశ్రీమతాంగేహే యోగభ్రష్టోభిజాయతే. 41

యోగభ్రష్టః - యోగమునుండిజారినవాడు; పుణ్యకృతాం - పుణ్యముచేసినవారియొక్క; లోకాన్ - లోకములను; ప్రాప్య-

పొంది; శాశ్వతీః-అనేకములైన; సమాః-సంవత్సరములు; ఉషిత్వా-ఉండి; శుచీనాం- సదాచారవంతులైన; శ్రీమతాం-శ్రీమంతులయొక్క; గేహే - గృహమునందు; అభిజాయతే-పుట్టుచున్నాడు.

యోగభ్రష్టుడు పుణ్యముజేసినవారి లోకములనుబొంది అనేక వత్సరములు వసించి సదాచారవంతులయిన శ్రీ మంతుల గృహమునందు బుట్టుచున్నాడు.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

అథవా-అట్లుకాదేని; ధీమతాం-నిశ్చయాత్మక బుద్ధిగలిగిన; యోగినాం-యోగులయొక్క; కులే-వంశమందు; భవతి-పుట్టుచున్నాడు; హి-యేకారణమువలన; ఈదృశం-ఇట్టి; యదేతజ్జన్మ-యేజన్మము; లోకే- లోకమునందు; దుర్లభతరం-మిక్కిలి దుర్లభమైనదో.

అట్లు గాకపోయినా అట్టి యోగభ్రష్టుడు నిశ్చయాత్మక బుద్ధిగల యోగులవంశమునందు బుట్టుచున్నాడు ఇట్టి జన్మము కలుగుట లోకమునందు అతిదుర్లభమని యెఱుంగుము.

తత్రతం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన. 43

పొందుటకొఱకు; శక్యః-శక్యమైనది; ఇతి- అని; మే - నాయొక్క; మతిః-మతమనుట.

చిత్తస్వాధీనము లేనివానికి యోగము అసాధ్యము. చిత్తస్వాధీనము గలవాడు తగిన యుపాయములచేత ప్రయత్నపడి యోగికావచ్చునని నా అభిప్రాయము.

అర్జున ఉవాచ.

అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాంగతింకృష్ణగచ్ఛతి. 37

హే కృష్ణ-ఓకృష్ణస్వామీ; శ్రద్ధయా- ఆస్తికబుద్ధితోడ; ఉపేతః-కూడుకొనియున్నవాడును; అయతిః-నియమము లేనివాడును; యోగాత్ - యోగమునవలన; చలితమానసః - చలింపబడినమనస్సుగలవాడు; యోగసంసిద్ధిం- యోగఫలమును; అప్రాప్య - పొందక; కాంగతిం- ఏస్థానమును; గచ్ఛతి- పొందుచున్నాడు.

ఓయి కృష్ణ! యోగమునందు శ్రద్ధయు, ప్రయత్నములు గలిగియు నియమము లేక పోయినందున చంచలమనస్సుగలిగిన వానికి యోగఫలము లేకపోవుచున్నది గదా, అట్టివానిగతి యేమి అగుచున్నది.

హే కురునందన - ఓయర్జునుడా; తత్ర - ఆయోగికులమందు; పౌర్వదైహికం-పూర్వదేహమందుబుట్టిన; తం-ఆ; బుద్ధిసంయోగం-బుద్ధితోకూటమిని; లభతే - పొందుచున్నాడు; తతః-అపిమ్మట; భూయః - మరల; సంసిద్ధౌ - జ్ఞానసిద్ధినిమిత్తమై; యతతేవ - ప్రయత్నముచేయుచున్నాడు.

ఓయి అర్జునా! పైన జెప్పిన ప్రకారము యోగికులమునందు బుట్టి పూర్వజన్మమునందు సంపాదించిన ఆత్మానాత్మ వివేకజ్ఞానమును బొందుచున్నాడు. అటు పిమ్మట జ్ఞానసిద్ధి నిమిత్తమై ప్రయత్నము జేయుచున్నాడు.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

తేన-అపూర్వాభ్యాసేనైవ- పూర్వజన్మాభ్యాసముచేతనే; సః-ఆయోగభ్రష్టుడు; అవశోపి- అవశమనస్కుడైనను; హ్రియతే - విషయములవలన వర్తించుచున్నాడు; యోగస్య-యోగముయొక్క స్వరూపమును, జిజ్ఞాసురపి - తెలియనిశ్చయించినవాడును; శబ్దబ్రహ్మ - వేదోక్తకర్మానుష్ఠానఫలమును; అతివర్తతే-అతిక్రమించుచున్నాడు.

పైన జెప్పిన యోగభ్రష్టుడు స్వాధీన మనస్సు లేనివాడైనా పూర్వజన్మాభ్యాసముచేత ఇంద్రియ విషయములలో నుండి

నివర్తుడగుచున్నాడు. యోగస్వరూపమును తెలియనిచ్ఛయించిన వాడుకూడా వేదోక్త కర్మానుష్ఠాన ఫలములను అతిక్రమించిన వానినిగా తెలియుము.

ప్రయత్నాద్యతమానస్తు యోగీసంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధస్తతోయాతిపరాంగతిమ్. 45

యోగీ-జ్ఞాననిష్ఠుడు; ప్రయత్నాత్-ప్రయత్నమువలన; యతమానస్తు-యత్నముచేయుచున్నవాడై; తతః-పిమ్మట; సంశుద్ధకిల్బిషం - పరిశుద్ధములైన పాపముగలవాడై; అనేకజన్మసంసిద్ధః- అనేకజన్మసంస్కారమువలన సిద్ధుడైనవాడై; తతః-ఆపిదప; పరాంగతిం-ఉత్కృష్టగతిని; యాతి-పొందుచున్నాడు.

జ్ఞాననిష్ఠుడు పరబ్రహ్మైక్యమునకు ప్రయత్నములు చేయుచున్నవాడయి పాపవిముక్తుడయి అనేకజన్మ సంస్కారములవలన పరిశుద్ధుడయి తర్వాత, సర్వోత్కృష్టమైన మోక్షమును బొందుచున్నాడు.

తపస్విభ్యోఽధికోయోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః।
కర్మిభ్యశ్చాధికోయోగీ తస్మాద్యోగీభవార్జున. 46

హే అర్జున-ఓ అర్జునుడా; యోగీ-యోగి; తపస్విభ్యః-కృచ్ఛ్రాదితపస్సులుగలవారికంటెను; అధికః-శ్రేష్ఠుడు; జ్ఞానిభ్యోపి-శాస్త్రార్థ పాండిత్యముగలవారికంటెను; అధికః-శ్రే

ష్టుడు; కర్మిభ్యశ్చ-కర్మములకంటెను; అధికః-శ్రేష్ఠుడని; మతః-అభిమతుడు; తస్మాత్ - ఆకారణమువలన; త్వం - నీవు; యోగీ - యోగముగలవాడవు; భవ-అగుము.

ఓయి అర్జున యోగియైనవాడు తపస్సులకంటెను శాస్త్రజ్ఞపాండిత్యము గలవారికంటెను కర్మనిష్ఠులకంటెను అధికుడు. ఆకారణమువలన నీవు యోగముగలవాడు కమ్ము.

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

యః-ఎవ్వడు; శ్రద్ధావాన్-విశ్వాసముగలవాడయి; మాం-నన్ను; మద్గతేన-నాయందునాసక్తమైన; అంతరాత్మనా-అన్తఃకరణముచేత; భజతే-సేవించుచున్నాడో; సః- వాడు; సర్వేషాం- సమస్తములైన; యోగినామపి - యోగులలోపలను; యుక్తతమః-శ్రేష్ఠుండని; మే నాకు; మతః - సమ్మతము.

ఎవ్వడయితే విశ్వాసముగలిగి నన్ను ఆశ్రయించి మనస్సుచేత సేవించుచున్నాడో, వాడు సమస్తయోగులలో శ్రేష్ఠుడని నామతము.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే ఆత్మ
సంయమ యోగోనామ షష్ఠోఽధ్యాయః.

ఉపనిషద్ రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాద రూ
పంబగు నాత్మసంయమ యోగమనెడి
షష్ఠోధ్యాయము ముగిసినది.

శ్రీ భగవద్గీత.

విజ్ఞాన యోగో నామ సప్తమోధ్యాయః.

శ్రీభగవాన్ ఉవాచ.

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

హే పార్థ - ఓయి అర్జునుడా; మయి-నాయందు; ఆస
క్తమనాః- తగిలిన మనస్సు గలవాడవయి; యోగం- యోగము
ను యుంజన్ -చేయుచున్నవాడవయి; మదాశ్రయన్సన్ - నేనే
ఆశ్రయముగాగలవాడవు; సమగ్రం - సకలగుణపరిపూర్ణుడ
డయిన; మాం-నన్ను; యథా-ఏ ప్రకారముగా; అసంశయం-
సందియము లేనట్లు; జ్ఞాస్యసి-తెలియగలవో; తత్ - ఆజ్ఞాన
మును; శృణు-వినుము.

ఓ అర్జునా! నాయందు చిత్తమును నిలిపి నన్నాశ్రయించి

యోగాభ్యాసము జేయుచు సంపూర్ణముగాడయినన్ను నిస్సంశయముగా నెట్లుఎరుగుదువో దానినివినుము.

జ్ఞానం తేహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః।
యత్ జ్ఞాత్వా నేహ భూయో౽న్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే. 2

అహం-నేను, సవిజ్ఞానం- అనుభవజన్యజ్ఞానముతో గూడిన; ఇదం జ్ఞానం - ఈ శ్రవణజన్యజ్ఞానమును; అశేషతః - సాకల్యముగా; తే-నీకొఱకు; వక్ష్యామి-చెప్పగలను, యత్ - దేనిని; జ్ఞాత్వా ఎఱింగి, ఇహ- ఈమోక్షవిషయమై; భూయః - తిరిగిన్ని; జ్ఞాతవ్య-తెలియగినది; అన్యత్ -మరియొకటి; నావశిష్యతే-మిగిలియుండదో.

నీకొరకు అనుభవజ్ఞానముతోగూడిన శాస్త్రీయజ్ఞానమును సవిస్తారముగా నేనుచెప్పెదను. ఈజ్ఞానమును దెలుసుకొంటినేని తెలిసికొనదగిన వేరువిషయము ఏదియును లేకపోవుచున్నది,

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. 3

మనుష్యాణాం- శాస్త్రాధికారయోగమనుష్యులయొక్క;సహస్రేషు - సహస్రములయందు; కశ్చిత్ - ఒకానొకడు; సిద్ధయే-ఆత్మసిద్ధికొరకు; యతతి-యత్నము చేయుచున్నాడు; య

తతామపి - యత్నముచేయుచున్న వారిలోనున్న; సహస్రేషు-సహస్రములయందు; కశ్చిత్ - ఒకానొకడు; మాం- నన్ను; తత్త్వతః-యథార్థమువలన, వేత్తి- తెలియుచున్నాడు.

వేలజనులలో జ్ఞానసిద్ధికొరకు ఒకఁడు ప్రయత్నము చేయుచున్నాఁడు. యత్నముజేసిన సిద్ధులలో ఒకఁడు మాత్రమే నన్ను నిశ్చయముగా యెరుగుచున్నాఁడు.

భూమిరాపోఽనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ
అహంకారఇతీయంమే భిన్నాప్రకృతిరష్టధా. 4

భూమిః-పృథివితన్మాత్రగంధగుణమున్న, ఆపః - ఉదకతన్మాత్రరసగుణమున్న అనలః-అగ్నితన్మాత్ర రూపగుణమున్న; వాయుః-వాయుతన్మాత్ర స్పర్శగుణమున్న; ఖం-ఆకాశతన్మాత్రశబ్దగుణమున్న, మనః - మనస్సున్ను; బుద్ధిరేవచ-బుద్ధిన్ని, అహంకారః-అహంకారమున్న; ఇతి-ఇవి, మే- నాయొక్క; ఇయం - ఈ చెప్పఁబడిన; ప్రకృతిః-మాయాశక్తి; అష్టధా-యెనిమిదివిధములుగా; భిన్నా - భేదమును పొందినది.

భూమి, నీళ్లు,అగ్ని, వాయువు, ఆకాశము, చిత్తము,బుద్ధి, అహంకారము అని నామాయ ఎనిమిదిభేదములుగానున్నవి.

అపరేయమితస్త్వన్యాం ప్రకృతింవిద్ధిమేపరామ్।
జీవభూతాంమహాబాహో యయేదంధార్యతేజగత్. 5

హే మహాబాహో - ఓయి అర్జునుడా; ఇయం-ఈప్రకృతి; అపరా-నికృష్టమయినది; ఇతస్తు-ఈప్రకృతికంటె; అన్యాం- ఇతరమయిన; జీవభూతాం-ప్రాణధారణ నిమిత్తభూతమయిన; పరాం - ఉత్కృష్టమయిన; మే-నాయొక్క; ప్రకృతిం-ప్రకృతిని; విద్ధి-తెలియుము; యయా-యేప్రకృతిచేత; ఇదంజగత్ - ఈప్రపంచము; ధార్యతే-ధరింపబడుచున్నదో.

ఓ అర్జునా! పైజెప్పిన నామాయాశక్తి నికృష్టమైనది. దీనికన్న జీవభూతమై ఉత్కృష్టమైనప్రకృతి మరియొకటియున్నదని తెలియుము. దానిచేతనే ఈప్రపంచము ధరింపబడియున్నది.

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహంకృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా. 6

సర్వాణి-సమస్తములైన; భూతాని- భూతములను; ఏతద్యోనీని - ఈరెండుప్రకృతులే కారణముగాగలిగినవని; ఉపధారయ-తెలియుము; తథా- ఆప్రకృతి; ద్వయ - ద్వారముచేత; అహం-నేను; కృత్స్నస్య-సమస్తమయిన; జగతః- ప్రపంచమునకు; ప్రభవః-ఉత్పత్తికారణమున్ను; ప్రళయః-నాశకారణమున్ను.

ఈ జీవభూతమైన పరప్రకృతియే సమస్తభూతములకు కా

రణమని నిశ్చయింపుము. సమస్తప్రపంచమునకు ఉత్పత్తిల యస్థానములు నేనేను.

మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

హే ధనంజయ-ఓయి అర్జునుడా; మత్తః-నాకంటె; పరతరం-ఎక్కుడైన శ్రేష్ఠమయిన; అన్యత్-మఱియొక కారణము; కించిత్-కొంచెమైనను; నాస్తి-లేదు; మయి-నాయందు; సర్వం-సమస్తమయిన, ఇదం-ఈజగత్తు, సూత్రే-దారమందు; మణిగణాఇవ-రత్నసమూహమువలెనే, ప్రోతం-కూర్చబడెను.

ఓ ధనంజయా! నాకన్న యితరకారణము మఱొకటిలేదు. ఈ సమస్తప్రపంచము దారమునందు రత్నములవలె నాయందు కూర్పబడియున్నది.

రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

హే కౌంతేయ-ఓయి అర్జునుడా; అప్సు-ఉదకముల యందు; రసః-రుచియును; శశిసూర్యయోః-చంద్రసూర్యుల యందు; ప్రభా-కాంతియును; సర్వవేదేషు-సమస్త వేదముల యందు; ప్రణవః-ఓంకారమును, ఖే-ఆకాశమందు; శబ్దః-శబ్దమును; నృషు-పురుషులయందు; పౌరుషం-పురుషపరిశ్రా

వమును; అహం-నేను; అస్మి-అవుచున్నాను.

ఓ అర్జునా ఉదకమునందు రసము సూర్య చంద్రాదుల యందు ప్రకాశము వేదముల యందు ప్రణవము ఆకాశము నందు శబ్దము పురుషులయందు పౌరుషము నేనుగా నెరుగుము.

పుణ్యోగంధఃపృథివ్యాంచ తేజశ్చాస్మివిభావసౌ।
జీవనస్సర్వభూతేషు తపశ్చాస్మితపస్విషు. 9

అహం-నేను;పృథివ్యా-భూమియందు; పుణ్యః-పరిమళించు చున్న; గంధశ్చ-గంధమున్ను; విభావసౌ- అగ్నియందు; తేజశ్చ-తేజమున్ను; అస్మి-అవుచున్నాను; సర్వభూతేషు- సమస్త భూతములయందు; జీవనం-ప్రాణాధారమయిన ఆయుస్సున్ను, తపస్విషు-తపస్సుగలవారలయందు: తపశ్చ-తపస్సున్ను;అస్మి-అవుచున్నాను.

భూమియందు సుగంధము అగ్నియందు తేజము ఎల్లభూతములయందు ఆయువు తపస్సులయందు తపస్సు నేనుగా నెరుగుము.

బీజంమాంసర్వభూతానాం విద్ధిపార్థసనాతనం।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజ స్తేజస్వినామహమ్. 10

హే పార్థ-ఓ అర్జునుడా; సనాతనం - శాశ్వతమైన; మాం-నన్ను; సర్వభూతానాం-సమస్తప్రాణులకు; బీజం - వ

రోహకారణమైయినవానిగా; విది-తెలియుము. ఇదియునుంగాక; అహం-నేను; బుద్ధిమతాం- వివేకశక్తిగల వారలయొక్క; బుద్ధిః-నిశ్చయాత్మకబుద్ధియు; తేజస్వినాం - తేజోవంతులయొక్క; తేజః-ప్రాగల్భ్యమును; అస్మి-అవుచున్నాను.

ఓ పార్థా! ఎల్ల చరాచర భూతములకు ఉత్పత్తికారణమైన అనాదిబీజము బుద్ధిమంతుల బుద్ధి తేజస్సు గలవానియందు తేజస్సు నేనుగా యెరుగుము.

బలంబలవతాంచాహం కామరాగవివర్జితం।
ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మిభరతర్షభ. 11

హేభరతర్షభ - ఓయి అర్జునుడా, బలవతాం-బలముగలవారలయొక్క; కామరాగవివర్జితం- అప్రాప్తానురాగములచేత విడువబడిన; బలం-బలమును; భూతేషు-ప్రాణులయందు; ధర్మావిరుద్ధః- ధర్మశాస్త్రవిరుద్ధమైన (స్వస్త్రీలయందు పుత్రోత్పత్తి నిమిత్తమైన) కామః-కామమును; అహం-నేను; అస్మి- అవుచున్నాను.

ఓ అర్జునా! బలవంతులయందు కామరాగములులేని బలము ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కామము నేనుగా యెరుగుము.

యేచైవసాత్త్వికాభావా రాజసాస్తామసాశ్చయే।
మత్తఏవేతితాన్విద్ధి నత్వహంతేషుతేమయి. 12

సాత్త్వికాః- సత్త్వగుణముచేతనైన; భావాః-శమదమాదులయినపదార్థములున్ను; రాజసాశ్చ- రజోగుణముచేతనైన దర్పహర్షాదులున్ను; తామసాశ్చ- తమోగుణము చేతనైన శోకమోహాదులున్ను; యే- ఏవిగలవో; తాన్- ఆభావములను; మత్తఏవేతి- నావలననైనవేయని; విద్ధి-తెలియుము; తేషు-ఆభావములయందు; అహం-నేను; న-లేదు; తే- ఆభావములు; మయి-నాయందున్నవి.

సత్త్వగుణరూపములైన శమదమాదులు రజోగుణ రూపములైన గర్వసంతోషాదులు తామసగుణరూపములైన శోకమోహాదులు నాయందు పుట్టినదియని తెలియుము, వాటికినేను స్వాధీనుడగాను, అవినాకు స్వాధీనము.

త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదంజగత్।
మోహితంనాభిజానాతి మామేభ్యఃపరమవ్యయమ్. 13

త్రిభిః- మూడువిధములయినట్టిన్ని; గుణమయైః- గుణసత్త్వాదివికారములయినట్టి; ఏభిర్భావైః- ఈ శమదమాదిపదార్థములచేత; మోహితం- అవివేకమును పొందింపబడిన; సర్వం-సమస్తమైన; ఇదంజగత్-ఈప్రపంచము; ఏభ్యః- ఈ

భావములకంటె; పరం-విలక్షుణుడయినట్టిన్ని; అవ్యయం- నాశ రహితుడైనట్టిన్ని; మాం-నన్ను; నాభిజానాతి- ఎఱుఁగదు.

పై జెప్పిన సత్త్వ రజస్తమాది గుణవికారములచే మోహింపబడిన, ఈసమస్తజగత్తువికారరహితుడై గుణములకన్న యితరుడైన నన్ను, యెరుగజాలదు.

దైవీహ్యేషాగుణమయీ మమమాయాదురత్యయా।
మామేవయేప్రపద్యంతే మాయామేతాంతరంతితే. 14

హి-ఏకారణమువలన; దైవీ-నాసంబంధమైన; గుణమయీ-త్రిగుణాత్మకమయిన; ఏషా- ఈచెప్పబడిన; మమ-నాయొక్క; మాయా-మాయ; దురత్యయా-దాటశక్యముగానిదో; ఆకారణమువలన; మామేవ-నన్ను; యే-ఎవరు; ప్రపద్యంతే- శరణుబొందుచున్నారో; తే-వారు; ఏతాంమాయాం-ఈమాయను; తరంతి-అతిక్రమింపుచున్నారు.

నాయందు పుట్టి త్రిగుణాత్మకమైన నామాయను ఎవరు అతిశయింపజాలరు. ఎవరైతేనన్నేశరణుబొందుచున్నారోవారు ఈమాయను అతిక్రమించగలరు.

నమాందుష్కృతినోమూఢాః ప్రపద్యంతేనరాధమాః।
మాయయాపహృతజ్ఞానా ఆసురంభావమాశ్రితాః. 15

దుష్కృతినః-పాపముచేసినట్టిన్ని; మూఢాః - వివేకరహి

తులైనట్టి; నరాధమాః - మనుష్యాధములు; మాయయా - మాయచేత; అపహృతజ్ఞానాః - అపహరించబడిన జ్ఞానముగలవారలై; అసురం-అసురసంబంధమైన; భావం - హింసానృత్యాదిస్వభావమును; ఆశ్రితాః-ఆశ్రయించినవారలై; మాం-నన్ను; నప్రపద్యంతె-భజింపరు.

పాపముచేయు మనుష్యులును మూఢులును నీచులును నా మాయవల్ల వివేకశూన్యులై అసురస్వభావులై హింసాదికర్మలు జేయువారు నన్ను శరణుపొందరు.

చతుర్విధాభజంతేమాం జనాస్సుకృతినో[illegible]న।

ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ [illegible] 16

హే భరతర్షభ - ఓయర్జునుడా; ఆర్తః- చోరవ్యాఘ్రాదులచేత పీడితుడైనవాడును; జిజ్ఞాసుః- తెలియనిశ్చయించినవాడును; అర్థార్థీ - ధనకాముడును; జ్ఞానీచ - ఆత్మజ్ఞానముకలవాడును; ఈప్రకారముగా; చతుర్విధాః-నాలుగువిధములుగలిగిన; సుకృతినః - పుణ్యవంతులైన; జనాః- జనులు;మాం-నన్ను; భజంతే- సేవింపుచున్నారు.

ఓ అర్జునా! నన్ను ఆశ్రయించు పుణ్యపురుషులు నాలుగు జాతులుగా నున్నారు. ఎరవరవిన చోర వ్యాఘ్రరోగములచే

పీడింపఁబడినవారు జ్ఞానాపేక్షగలవారు సకాములు జ్ఞానము గలవారు.

తేషాంజ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియోహిజ్ఞానినోత్యర్థ మహంసచమమప్రియః. 17

తేషాం- ఆనలుగురిలోపల; నిత్యయుక్తః-నిత్యయోగియై నట్టిన్ని; ఏకభక్తిః-ముఖ్యభక్తిగలిగినట్టిన్ని; జ్ఞానీ-జ్ఞానముగల వాఁడు; విశిష్యతే-అధికుడగుచున్నాఁడు; జ్ఞానినః-జ్ఞానికి; అహం-నేను; అత్యర్థం-మిక్కిలి; ప్రియః - ప్రియుఁడైనవాఁడున్ను; సః-ఆజ్ఞాని; మమ-నాకు; ప్రియోహి-ఇష్టుఁడైనవాఁడున్నుకదా?

ఈ నలుగురిలో చలింపనిభక్తిగల ఆత్మజ్ఞాని అందరికన్న శ్రేష్ఠుఁడు. అట్టివానికి నేను మిక్కిలి యిష్టుఁడను, వాఁడునాకు యిష్టుఁడు.

ఉదారాస్సర్వఏవైతే జ్ఞానీత్వాత్మైవమేమతమ్।
ఆస్థితస్సహియుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్. 18

ఏతేసర్వే-ఈనలుగురున్ను; ఉదారాఏవ- ఉత్కృష్టులేను; జ్ఞానీతు-జ్ఞానియైతే; ఆత్మైవ-నేనేయని; మే-నాయొక్క; మతం-ఇష్టము; హి-ఏకారణమువలన; సః-ఆజ్ఞాని; యుక్తాత్మాసన్-నియమింపబడినమనస్సుగలవాఁడై; మామేవ-నన్నే; అనుత్తమాం-శ్రేష్ఠమైన; గతిం-ప్రాప్యస్థానముగాను; ఆస్థితః-పొం

దినవాడో; యః-ఎవ్వడు.

నాల్గు జాతివారును ఉత్కృష్టులేను. అయినను అందులో జ్ఞాని నేనే యని నా యభిప్రాయము. ఎందువల్లనన చలింపని చిత్తముగలజ్ఞాని నన్నే ఉత్తమగతిగా నమ్మినవాడు.

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః. 19

బహూనాం - అనేకములయిన; జన్మనాం - జన్మములయొక్క; అంతే-కడపటను; జ్ఞానవాన్సన్ - జ్ఞానముగలవాడై; సర్వం-సమస్తమున్ను; వాసుదేవఇతి- వాసుదేవుడేయని; మాం-నన్ను; ప్రపద్యతే-పొందుచున్నాడో; సమహాత్మా - ఆమహాత్ముడు; సుదుర్లభః-మిక్కిలిదుర్లభుడు.

జ్ఞానార్థ సంస్కారముగల అనేక జన్మములు ఎత్తిన పిదప మనుష్యుడు జ్ఞానియై సమస్తము దేవస్వరూపమని నన్ను శరణు బొందుచున్నాడు. అట్టి వాడు మహాపురుషుడు మిక్కిలి దుర్లభుడు.

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేన్యదేవతాః।
తంతంనియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.

స్వయా-ఆత్మీయమైన; ప్రకృత్యా-స్వభావముచేత; నియతాః-ఆజ్ఞాపింపబడినజనులు; తైస్తైఃకామైః- ఆయావిషయము

లచేత; హృతజ్ఞానాస్సంతః-అపహరింపబడిన వివేకము గలవారలై; తంతంనియమం - ఆయా దేవతారాధనాది నియమములను; ఆస్థాయ-అధిష్ఠించి; అన్యదేవతాః - ఇతర దేవతలను; ప్రపద్యంతే-భజింపుచున్నారు.

మనుష్యులు కోరికలవలన వివేకశూన్యులగుచు ఆ యా కోరికలనిచ్చు దేవతలను వారివారి స్వభావములచేత ఆ యా కల్పోక్తనియమముల నాచరించి శరణుపొందుచున్నారు.

యో యో యాం యాంతనుంభక్తశ్శ్రద్ధయార్చితు
మిచ్ఛతి।
తస్యతస్యాచలాంశ్రద్ధాం తామేవవిదధామ్యహమ్. 21

యోయః-ఏయేకామముగలవాడు; భక్తస్సన్ - భక్తుడైనవాడై; యాంయాంతనుం-ఏయే దేవతావిగ్రహమును; శ్రద్ధయా-విశ్వాసముచేత; అర్చితుం - పూజించుటకొఱకు; ఇచ్ఛతి-ఇచ్ఛయింపుచున్నాడో; తస్యతస్య- ఆయాకామముగలవానికి; అహం-నేను; తాంశ్రద్ధామేవ- ఆశ్రద్ధనే; అచలాం- స్థిరమైనదాన్నిగా; విదధామి-చేయుచున్నాను.

ఎవడెవడు ఏ ఏ కోరికలచేత ఏ ఏ దేవతలను భక్తి శ్రద్ధలతో కొలుచుచున్నాడో వానివానికి ఆ యా దేవతలయందు శ్రద్ధాభక్తులను నేను నిశ్చయముగా జేయుచున్నాను.

సతయాశ్రద్ధయాయుక్త స్తస్యారాధనమీహతే
లభతేచతతః కామాన్ మయైవవిహితాన్హితాన్, 22

సః-అభక్తుడు; తయా-నాచేత చెప్పబడిన; శ్రద్ధయా-శ్రద్ధతోడను; యుక్తస్సన్-కూడినవాడై; తస్య - ఆ దేవతావిగ్రహముయొక్క; ఆరాధనం-పూజను; ఈహతే- ఇచ్ఛయించుచున్నాడు; మయైవ-నాచేతనే; విహితాన్ - చేయబడిన; హితాన్-ఇష్టములైన; కామాన్-కోరికలను; తతః-ఆవిగ్రహమువలన; లభతే-పొందుచున్నాడు.

అట్టి మనుష్యుడు అట్టిశ్రద్ధచే ఆ యా దేవతను పూజించుచున్నాడు. ఆ దేవత మూలముగా నా చేతనే యియ్యబడిన వానివాని యభీష్టములను వాడువాడు పొందుచున్నాడు.

అంతవత్తుఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్।
దేవాన్ దేవయజోయాంతి మద్భక్తాయాంతిమామపి. 23

దేవయజః-అన్యదేవతలను పూజించువారలు; దేవాన్-దేవతలను; యాంతి-పొందుచున్నారు; అల్పమేధసాం- కొంచెపుబుద్ధిగల్గిన; తేషాం-అన్యదేవపూజలయొక్క; తత్ఫలంతు-ఆఫలమైతే; అంతవత్-నాశముగలిగినది; భవతి-అగుచున్నది; మద్భక్తాః-నాభక్తులు; మాం-నన్ను; యాంతి - పొందుచున్నారు.

అల్పబుద్ధిగల ఆ పురుషుల కోరికల ఫలములు నశింపగలవి. దేవతల నారాధించువారు ఆ యా దేవతల స్థానములను పొందుచున్నారు. నా భక్తులు నన్నే పొందుచున్నారు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః।
పరంభావమజానంతో మమావ్యయమనుత్తమమ్. 24

అవ్యయం-నాశ రహితమైనట్టిన్ని; అనుత్తమం-నిరతిశయమైనట్టిన్ని; పరం-ఉత్కృష్టమైనట్టిన్ని; మమ-నాయొక్క; భావం-స్వరూపమును; అజానంతః-తెలియని; అబుద్ధయః-మూఢులు; అవ్యక్తం-అప్రకాశకుడైన; మాం-నన్ను; వ్యక్తి- ప్రకాశమును; ఆపన్న-పొందినవానిగాను; మన్యంతె - తలంచుచున్నారు.

వ్యక్తముగాని నన్ను బుద్ధిహీనులు వ్యక్తునిగా ఎంచుచున్నారు. నా సర్వోత్కర్షమును ఎరుఁగని వారు నాకు నాశముగలదని భావించుచున్నారు.

నాహంప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః।
మూఢో౽యం నాభిజానాతి లోకోమామజమవ్యయమ్. 25

అహం-నేను; సర్వస్య-సమస్తలోకమునకున్ను; ప్రకాశః-ప్రకాశమయినవాడను; న-కాను; మూఢః - జ్ఞానహీనమైనయు న; అయంలోకః-ఈజనము; యోగమాయాసమావృతః-యై

గుణ్యమనెడిమాయచేత కప్పబడినవాఁడై; మాం-నన్ను; అజం-జ
న్మరహితునిగానున్ను; అవ్యయం-నాశరహితునిగానున్ను;నాభి
జానాతి-యెఱుఁగఁడు.

యోగమాయచేత కప్పబడ్డనేను ఎవరివల్లను యెఱుఁగఁబడ
దనివాఁడను, మూఢుఁడు నన్ను జన్మరహితునిగానున్ను తెలిసి
కొనఁజాలఁడు.

వేదాహంసమతీతాని వర్తమానానిచార్జున।
భవిష్యాణిచభూతాని మాంతువేద న కశ్చన. 26

హే అర్జున-ఓయర్జునుఁడా; అహం-నేను; సమతీతాని-
అతిక్రమించునట్టిన్ని; వర్తమానానిచ-ఉన్నట్టిన్ని; భవిష్యాణి
చ-కాఁగలయట్టి; భూతాని-ప్రాణులను; వేద-యెఱుఁగుదును;
కశ్చన-ఒక్కఁడున్ను; మాంతు-నన్నైతే; న వేద-యెఱుఁగఁడు.

ఓ అర్జునా! భూతకాలమునందు ఉండినట్టి వర్తమానకా
లమందు ఉండునట్టి భవిష్యత్కాలమునందు ఉండఁగల ప్రాణి
సమూహములను నేను తెలియుదును. అయినను నన్ను ఎవ
డును ఎఱుఁగఁడు.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేనభారత।
సర్వభూతానిసంమోహం సర్గేయాంతిపరంతప. 27

హే భారత,హేపరంతప- ఓయర్జునుఁడా, సర్గే-ఉత్ప

త్రికాలమందు; ఇచ్ఛాద్వేషసముత్థేన- కామక్రోధములవలన బుట్టిన; ద్వంద్వమోహేన-సుఖదుఃఖ హేతువైన అవివేకము చేతను; సర్వభూతాని-సర్వభూతములు; సంమోహం- మిక్కిలి అజ్ఞానమును; యాంతి-పొందుచున్నవి.

ఓ అర్జునా! ఈ స్థూలశరీరమందు ఇచ్ఛాద్వేషముల వలన బుట్టిన ద్వంద్వరూపమయిన సుఖదుఃఖముల యందు మోహముచేత ఎల్లప్రాణులు జన్మసమయమునందే మూఢత్వమును బొందుచున్నారు.

యేషాంత్వంతగతంపాపం జనానాంపుణ్యకర్మణాం।
తేద్వంద్వమోహనిర్ముక్తా భజంతేమాందృఢవ్రతాః.28

పుణ్యకర్మణాం - సుకృతకర్మములు గలిగిన; యేషాం జనానాం-ఏజనులయొక్క; పాపంతు-పాపమైతే; అంతగతం-నాశమునుపొందినదో; తే-ఆజనులు; ద్వంద్వమోహనిర్ముక్తాస్సంతః-ద్వంద్వాదిసుఖదుఃఖహేతువైన అవివేకముచేత విడువబడినవారలయి; దృఢవ్రతాః-నిశ్చయమైన నియమము కలవారలై; మాం-నన్ను; భజంతే-సేవించుచున్నారు.

సుకృత కర్మలుగల వారు వారిపాపములు నశించిన పిదప ద్వంద్వగుణములయిన సుఖదుఃఖములనెడు అవివేకమునుండి

విడువబడిన వారయి నిశ్చల నియమముతో నన్ను గొల్చుచు చున్నారు.

జరామరణమోక్షాయ మామాశ్రిత్యయతంతియే।
తే బ్రహ్మతద్విదుఃకృత్స్న మధ్యాత్మంకర్మచాఖిలం. 29

యే-యెవరు; జరామరణమోక్షాయ-జరామరణముల విడుపుకొరకు; మాం-నన్ను. ఆశ్రిత్య-ఆశ్రయించి; యతంతి-యత్నముచేయుచున్నారో; తే-ఆజనులు; తద్బ్రహ్మచ-ఆబ్రహ్మమున్ను; కృత్స్నం-సమస్తమైన; అధ్యాత్మం-ప్రత్యగాత్మ విషయవస్తువున్ను; అఖిలం-సమస్తమయిన; కర్మచ-కర్మమున్ను; విదుః-యెరుగుదురు.

ఎవరైతే జనన మరణ రహితమయిన మోక్షాపేక్షతో నన్ను ఆశ్రయించి అందులకు దగిన యత్నములు చేయుచున్నారో అట్టివారు సమస్త జీవకోటికి నంతర్గతముగానుండు ఆ పరబ్రహ్మమునున్ను సమస్తకర్మలనున్ను తెలిసికొనినవారగుదురు.

సాధిభూతాధిదైవంమాం సాధియజ్ఞంచయేవిదుః।
ప్రయాణకాలేపిచమాం తేవిదుర్యుక్తచేతసః. 30

యే-ఎవరు; సాధిభూతాధిదైవం - అధిభూతాదిదైవముల తోకూడినట్టిన్ని; సాధియజ్ఞంచ-అధియజ్ఞముతో గూడినట్టిన్ని;మాం-నన్ను; విదుః- తెలియుదురో; తే-వారు; ప్రయాణ

కాలేపిచ-అంతకాలమందున్ను; యుక్తచేతసః-నియమింపబడిన మనస్సుగలవారలయి; మాం-నన్ను; విదుః-తెలియుదురు.

అధిభూత అధిదైవితములతోను అధియజ్ఞముతోను చేరియున్న నన్నెవరెఱుఁగుదురో అట్టివారు అంత్యకాలమునఁగూడా అచంచలమయిన మనస్సు గలవారై నన్ను తెలిసికొనుదురు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
విజ్ఞానయోగోనామ సప్తమోఽధ్యాయః.

ఉపనిషద్ రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాద రూ
పంబయిన విజ్ఞాన యోగ మనెడి
సప్తమోఽధ్యాయముముగిసినది.

శ్రీ భగవద్గీత.

అక్షరపర బ్రహ్మయోగోనామ అష్టమోఽధ్యాయః.

అర్జున ఉవాచ.

కింతద్బ్రహ్మకిమధ్యాత్మం కింకర్మపురుషోత్తమ।
అధిభూతంచకింప్రోక్త మధిదైవంకిముచ్యతే. 1

అర్జునుడు చెప్పుచున్నాడు. హేపురుషోత్తమ - ఓశ్రీకృష్ణస్వామీ; తద్బ్రహ్మ-ఆబ్రహ్మము; కిం-యేది; అధ్యాత్మం-అధ్యాత్మము; కిం-ఎట్టిది; కర్మ-కర్మము;కిం-ఎట్టిది; కిం-ఏది; అధిభూతం-అధిభూతమని; ప్రోక్తం-చెప్పబడెను; కిం-ఏది; అధిదైవం-అధిదైవమని; ఉచ్యతే-చెప్పబడుచున్నది.

ఓ పురుషోత్తమా! ఆ పరబ్రహ్మము ఏది అధ్యాత్మమనునేమి కర్మయన్న నెట్టిది అధిభూతమని యొద్ది చెప్పఁబడుచున్నది అధిదైవమని ఏది చెప్పబడును.

అధియజ్ఞఃకథంకోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన।
ప్రయాణకాలేచకథం జ్ఞేయోఽసినియతాత్మభిః. 2

హే మధుసూదన-ఓ శ్రీకృష్ణస్వామీ, అస్మిన్ దేహే-ఈశరీరమందు, అధియజ్ఞః - అధిష్ఠాతయున్న ప్రయోజకుడున్న ఫలదాయకుడున్న, కః-యెవ్వడు; అత్ర-ఈవిషయమందు; కథం-ఎట్లు; జ్ఞేయః-తెలియదగినవాడు: ప్రయాణకాలే-దేహాంతకాలమందు; నియతాత్మభిః-నియమింపబడిన చిత్తముగలవారలచేత; కథం-ఏప్రకారముగా; జ్ఞేయః-తెలియదగినవాడవు; అసి- అవుచున్నావు.

ఓ మధుసూదనా! ఈ దేహమునందు అధియజ్ఞుడనెడివాడెవ్వండు, వాడెట్లున్నవాడు, చలింపని మనస్సుగల వారలచే

త అగత్యకాలమునందు నీవు ఏవిధమున తెలియఁగఁబడువాడ వు అన్నియునునాకు స్పష్టముగా దెలియజేయుము.

శ్రీభగవాన్ ఉవాచ.

అక్షరంబ్రహ్మపరమం స్వభావోధ్యాత్మముచ్యతే॥
భూతాభావోద్భవకరో విసర్గఃకర్మసంజ్ఞితః. 3

భగవద్వాక్యము. పరమం-నిరతిశయమైన; బ్రహ్మ - బ్రహ్మము; అక్షరం-నాశరహితమైనది; స్వభావః-ఆపరబ్రహ్మముయొక్క ప్రత్యగాత్మభావము; అధ్యాత్మం- అధ్యాత్మమని; ఉచ్యతే-చెప్పబడుచున్నది అనగా దేహమును ప్రత్యగాత్మ స్వరూపముచేత నధిష్ఠించియుండునది; అధ్యాత్మ-ఆఅధ్యాత్మమున్ను బ్రహ్మరూపమాయినదే; భూతభావోద్భవకరః- భూతప్రాణులయొక్క: భావ-స్వరూపమునకు, ఉద్భవః-ఉత్పత్తిని: కరః-చేయుచున్నట్టి; విసర్గః - దేవతలనుద్దేశించి చేయుచున్నట్టి పురోడాశాది ద్రవ్యపరిత్యాగము, కర్మసంజ్ఞితః - కర్మమనుసంజ్ఞగలది.

పరబ్రహ్మము నాశము లేనిది, ఆ పరబ్రహ్మముయొక్క స్వభావమే అధ్యాత్మము. ప్రాణులయొక్క వ్యుత్పత్తి వృద్ధి నిమిత్తమై చేయునది కర్మయనబడును.

అధిభూతంక్షరో భావః పురుషశ్చాధిదైవతమ్।
అధియజ్ఞోహమేవాత్ర దేహే దేహభృతాంవర, 4

దేహభృతాంవర- దేహధారులలో శ్రేష్ఠుడైన ఓయిఅర్జునుడా; అధిభూతం-ప్రాణిజాతము;అక్షరః-నశించునట్టి; భావః- ఉత్పత్తిగలవస్తువు; పురుషః - సూర్యాంతర్గతుడును సకల ప్రాణుల యింద్రియములకును గ్రాహకుడునయిన హిరణ్యగర్భుడు (శ్రు) "సవైశరీరీ ప్రథమస్సవై పురుషఉచ్యతే। ఆదికర్తాసభూతానాం బ్రహ్మాగ్రేసమవర్తత" దేహధారులలో మొదటివాడున్ను పురుషుండని చెప్పబడెడివాడున్ను సకల భూతములకు ఆదికర్తయునైన బ్రహ్మ ముందుగా పుట్టెనని యీశ్రుత్యర్థము. అధిదైవతం- దేవతకు నధిపతియగుటవల అధిదైవతము; అత్ర దేహే - ఈ శరీరమందు; అధియజ్ఞః-సర్వయజ్ఞాభిమానియైనవిష్ణ్వాఖ్యదేవత, అహమేవ-నేనే; (శ్రు) "యజ్ఞోవై విష్ణుః" యజ్ఞమేవిష్ణువని శ్రుత్యర్థము, యజ్ఞము దేహముచేత చేయబడుటవలన దేహమందుండు నట్టిదనిన్ని దేహమే ఆధారముగా గలిగినదనిన్ని భావము.

ఓయర్జునా! నశించెడి స్వభావముగల ఎల్ల చరాచరములు అధిభూతంబని చెప్పబడును. అధిదైవమనగా హిరణ్య గర్భ స్వరూపుడు ప్రాణులయొక్క దేహములయందు అంతర్యామి

డైన అధియజ్ఞుడని యెడువాడు నేనే.

అంతకాలేచమామేవ స్మరన్ముక్త్వాకళేబరమ్।
యఃప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్రసంశయః. 5

యః-ఎవ్వడు; అంతకాలే-దేహాంతసమయమందు; మామేవ-నన్నే; స్మరన్-స్మరింపుచున్నవాడై; కళేబరం-శరీరమును; ముక్త్వా-విడిచి; ప్రయాతి-పోవుచున్నాడో; స - వాడు; మద్భావం-నాస్వరూపమును; యాతి-పొందుచున్నాడు;అత్ర-ఈ అర్థమందు; సంశయః-సందేహము: నాస్తి- లేదు. ఈ చెప్పబడిననియమము నావిషయమైన దేకాదు వారి యేమనిన నీశ్లోకమందు జెప్పబడుచున్నదివినుము.

ఎవడు అంత్యకాలమందు నన్నే ధ్యానించుచున్న వాడయి శరీరమును వదలుచున్నాడో వాడు నన్ను జెందుచున్నాడు. ఇందులకు ఏమాత్రము సందేహము లేదు.

యంయంవాపిస్మరన్ భావం త్యజత్యంతేకళేబరమ్।
తంతమేవైతికౌంతేయ సదాతద్భావభావితః. 6

హే కౌంతేయ-ఓయర్జునుడా; యః-ఏవ్వడు; అంతే-అంతకాలమందు: యంయంభావం-ఏయే దేవతావిశేషమును; స్మరన్-చింతింపుచున్నవాడై; కళేబరం- శరీరమును, త్యజతి-త్యజింపుచున్నాడో; సః-వాడు, సదా-ఎల్లప్పుడును; తద్భా

వభావితస్సన్-ఆయా దేవతా విశేషమునందును చింతనము బొందబడినవాడై; తం తమేవ- ఆయా స్మరింపబడిన భావమునే; యాతి-పొందుచున్నాడు.

ఓ అర్జునా! పురుషులు ఏయే దేవలను చలించని మనస్సుతో అంత్యకాలమందు స్మరించుచూ శరీరములను వదలుచున్నారో వారు అట్టి దేవతలస్వరూపములను జెందుచున్నారు.

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మరయుధ్యచ।
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్యసంశయః. 7

ఏకారణమువలన నంత్యకాలమందన్యదేవతా ను చింతన పునర్జన్మాదులకు కారణమగుచున్నదో; తస్మాత్ - ఆ కారణము వలన; సర్వేషు-సమస్తములయిన, కాలేషు-సమస్తములయందు; మాం-నన్ను; అనుస్మర-చింతించుము; యుధ్యచ- యుద్ధశాస్త్రముగాయుద్ధము జేయుము. త్వం-నీవు; మయి-నాయందు; అర్పితమనోబుద్ధిస్సన్-అర్పిత-ఉంచబడిన; మనః- మనస్సున్ను; బుద్ధిః-బుద్ధియున్ను కలవాడవై; మామేవ-నన్నే; ఏష్యసి-పొందగలవు; అసంశయః-ఈయర్థమందు సందియము లేదు.

కాబట్టి నీవు సర్వకాలములయందును నన్నే ధ్యానించుచు యుద్ధము జేయుము. నా యందు నిశ్చలమయిన మనోబుద్ధులను వుంచితివేని నన్ను పొందగలవు, ఇందుకు సందియము లేదు.

అభ్యాసయోగయుక్తేన చేతసానాన్యగామినా।
పరమంపురుషందివ్యం యాతిపార్థానుచింతయన్. 8

ఉపాసనప్రకారమును జెప్ప ఆరంభించుచున్నాడు. హే పార్థ- ఓయిఅర్జునుడా; అభ్యాసయోగయుక్తేన, అభ్యాస- అభ్యాసమనెడి, యోగ- యోగముతోడను, యుక్తేన- కూడియున్నట్టిన్ని; నాన్యగామినా- మరియొకవస్తువును పొందునట్టి; చేతసా- మనస్సుచేతను; దివ్యం- సూర్యమండలమందు వుండినట్టిన్ని; పరం- ఉత్కృష్టమయిన; పురుషః- పురుషుని; అనుచింతయన్- శాస్త్రాచార్యోపదేశమువలన స్మరింపుచున్నవాడై; తమేవ- ఆపరమపురుషున్నే; యాతి- పొందుచున్నాడు.

ఓ అర్జునా! ఎవడైతే అభ్యాస యోగముతో గూడుకొని ఇతర వ్యాకులములులేని చిత్తముతో దివ్యరూపుడైన మహా పురుషుని స్మరణ జేయుచున్నాడో వాడు ఆ పరమపురుషునినే పొందుచున్నాడు.

కవింపురాణ మనుశాసితార మణోరణీయాంస
మనుస్మరేద్యః।
సర్వస్యధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం
తమసఃపరస్తాత్. 9

దేనితోకూడియున్న పురుషుని పొందుచున్నాడనిన చెప్పు

